# సౌమ్యమైనది




సూపర్ పవర్

# చెక్

**ఏ మాత్రం హాని చేయని,**
**శక్తివంతమైన డిటర్జెంట్ పౌడర్.**

బట్టల ధరలు విపరీతంగా పరిగిపోతున్న ఈ రోజుల్లో మీకు కావలసింది బట్టలకు ఏ మాత్రం హాని చేయని డిటర్జెంట్ పౌడర్ మాత్రమే. తళ తళ లాడే తెలుపునిచ్చే చెక్ యొక్క సూపర్ పవర్ ఫార్ములా మీ బట్టల సున్నితత్వాన్ని, మరియు మీ చేతుల మృదుత్వాన్ని కాపాడుతుంది.

**మరింత భద్రతకోసం**

1 కి. గ్రా. రూ. 12.37 (పన్నులు అదనం)

**చెక్ తో ఉతకండి, లేదా చెక్ చేయండి**

aimc/DIL/4809

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు -
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 1972)

శుక్రవారం : 18-7-'80
రక్తాక్షినామ సం. ఆషాఢ శు.
సంపుటము 73 : సంచిక 47

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 49-40
ఆరు మాసాల చందా రు. 24-70
విడి ప్రతి వెల 90 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

# దేశ దేశాల్లో తెలుగువారు

మేము ఇంగ్లాండుకు వచ్చి దాదాపు మూడు సంవత్సరాలు కావస్తున్నది. ఇక్కడ తెలుగు వారు చాలామందే ఉన్నారు. మనకన్నా ఉత్తరభారతీయులు చాలా ఎక్కువ. వారికి అసలు "తెలుగు" అన్న పదమే తెలియదు. దక్షిణభారతీయులందరూ తమిళ్ మాట్లాడ్తారనుకుంటారు. మన దేశం వాళ్ళకి "తెలుగు" తెలియదంటే కొంచెం బాధగా ఉంటుంది ఇక్కడ మన వాళ్ళకి!

లండన్‌లోని "సౌత్‌హాల" "బర్మింగ్‌హామ్", "లెస్టర్", "లూటన్"లలో చాలామంది ఇండియన్స్ స్థిరనివాసరేర్పర్చుకున్నట్టు కనబడతారు. సౌత్‌హాలు, బర్మింగ్‌హామ్‌లలో ఇంగ్లీషు వాళ్ళు అప్పుడప్పుడు "ఇండియాగా" అంటుంటారు. అసలు ఇక్కడ ఇంగ్లీషు వాళ్ళే ఇండియాకు వచ్చారా! అన్నట్లుంటారు. ఇండియన్స్ చాలా మంది ఉన్నా






కూడా "తెలుగు వారు" చాలా తక్కువగా కనబడతారు. మొదట్లో తెలుగు వారు కన్పిస్తే చాలు, ఎంతో సంతోషంగా ఉండేది. ఇప్పుడు చాలామంది తెలుగువారు పరిచయం కావటం వలన అప్పుడప్పుడు ఇండియాలో ఉన్నామా? అన్న భ్రాంతి కల్గుతూంది!

మేము ఉండే ఊరు "లూటన్"లో మాతో కలిపి నాలుగు కుటుంబాల తెలుగు వారున్నారు. మేమందరం దాదాపు వారానికి మూడు, నాలుగుసార్లు కల్సుకుంటూంటాం.

అందరం చాలా స్నేహంగా ఉంటుంటాం. మేము ఇక్కడికి వచ్చిన క్రొత్తలో "కోల్చెస్టర్" అనే చోట ఉండేవాళ్ళం. అక్కడున్నన్నిరోజులూ తెలుగువారికోసం పరితపించాం. తర్వాత "లింకన్" అనే ఊరికి వచ్చిన తర్వాత దాదాపు ఆరు కుటుంబాల తెనుగువాళ్ళు కలిశారు. అంతమంది తెనుగు వాళ్ళు అలా ఒకే చోట ఉండడం చాలా అరుదు. చిన్నసైజు ఆంధ్రప్రదేశ్‌లా ఉందనిపించింది. ప్రతి పండుగా అందరం కలిసి చేసుకునేవాళ్ళం. తరుచుగా 'వీకెండ్స్' (శని, ఆదివారాలు) తప్పని సరిగా కల్సుకునే వాళ్ళం.

## చింతపండు, మిరపకాయలు సైతం

ఇక్కడ మన తెలుగు భోజనానికి లోటేమీ లేదు. ఈ లూటన్, బర్మింగ్‌హామ్, లెస్టర్, సౌత్‌హాల, వ్యాంటార్స్, బ్రాడ్‌ఫోర్డ్ లాంటి చోట్ల ఇండియన్ షాపులు కోకొల్లలుగా ఉన్నాయి. ఏ కాలంలోనయినా అన్నిరకాల కూరగాయలు, చింతపండు, బెల్లం, ఎండు మిరపకాయలు, అన్నిరకాల పప్పులు, పిండ్లు, అప్పడాలు, వడియాలు, ఊరగాయలు, ఇడ్లీ, సాంబార్, దోసెలలాంటి ఇన్‌స్టాంట్ మిక్సులు ఇంకా చాలా దొరుకుతాయి. చీరల షాపులు కూడా చాలా ఉన్నాయి. అమెరికన్ జార్జెట్ లాంటి రకరకాల చీరలు, అన్నిరకాల పట్టు చీరలు దొరుకుతాయి. కాని కాటన్ చీరలు మాత్రం చాలా తక్కువ. చీరల షాపుల్లోనే స్త్రీలుసామాన్లు కూడా అమ్ముతారు. ఇత్తడి పాత్రలూ దొరుకుతాయి.

ఇండియన్ షాపులు లేని చోట్ల "కాంటినెంటల్" స్టోర్సు అని వుంటాయి. ఆ షాపుల్లో పప్పులు, పిండ్లు, చింతపండు, పచ్చిమిరపకాయలు, మసాలా సామాన్లు దొరుకుతాయి.

ఇంగ్లీషు షాపుల్లో కూడా బియ్యం, "లెంటిల్స్" అనే ఎర్రపప్పు, వంకాయలు, అల్లం, వెల్లుల్లి దొరుకుతాయి.

చాలా చోట్ల ఇండియన్ రెస్టారెంట్లు ఉంటాయి. కాని, వాటిల్లో పూరీ, చపాతీ, ఫ్రైడ్‌రైస్, వగైరా కూరలు తప్ప ఇడ్లీ దోసె దొరకవు. ఇంగ్లీషువాళ్ళు చాలామంది ఈ రెస్టారెంట్లలో కన్పిస్తారు.

ఇక్కడ దాదాపు తెలుగు వారందరూ పత్రిక, ప్రభలాంటి వారపత్రికలు, తెలుగు

## ఇంగ్లాండులో తెనుగు వారు

పుస్తకాలు తెప్పిస్తుంటారు. కాని, వార పత్రికలు మాత్రం ఒకటి, రెండు వారాలు ఆలస్యంగా మాకు చేరుతాయి !

## మన సినిమాలు కూడా !

ప్రతి ఆదివారం హిందీ సినిమాలు ఇక్కడి థియేటర్లలో చూడొచ్చు. ఒక టికెట్‌కు రెండు సినిమాలు. అదీగక "వీడియో టేప్స్" అనివుంటాయి. అవి అద్దెకిస్తుంటారు! వాళ్ళే మనకిష్టమయిన సినిమా తెచ్చి మన టి. వి. లో వేస్తుంటారు. అయితే ఇక్కడ తెలుగువాళ్ళందరం పోగు పెట్టి కొల్‌హాత నుండి తెలుగు సినిమాలు తెప్పించుకొని చూస్తుంటాం. అన్నీ పాతవే అనుకోండి! అయినా ఇంగ్లాండులో తెలుగు సినిమా చూస్తున్నామంటే అదొక చెప్పరాని చిత్రమైన అనుభూతి !

ఇంగ్లీషు వాళ్ళు కొంతమంది ఇండియా అంటే అభిమాన పడ్తారు. ముసలివాళ్ళను కదిలిస్తే వాళ్ళు ఇండియాలో ఉన్నప్పటి విషయాలన్నీ కథలుగా చెప్తారు. 'హైదరాబాద్, సికింద్రాబాద్, మద్రాస్' వాళ్ళకు బాగా తెల్సు. వీళ్ళకు మన 'గాంధీజీ' అంటే చాలా గౌరవం. లండన్‌లోని "మేడమ్ టుస్సాడ్స్"లో గాంధీజీ మైనం విగ్రహం జీవకళ ఉట్టిపడుతూ చూపరుల నాకర్షిస్తూంటుంది.




ఇక్కడ సాంఘిక జీవనం చాలా సుఖవంతంగా ఉంటుంది. ఏ సమస్యలు వచ్చినా "సోషల్ సెక్యూరిటీ" వాళ్ళు సహాయం చేస్తారు. ప్రతి నిరుద్యోగికి వారానికి 30 పౌండ్లు చొప్పున ఇస్తారు. పిల్లలున్న వారికి, వారానికి నాలుగు పౌండ్లు ఒక పిల్లవాడికి చొప్పున ఆ డబ్బు తల్లికి గాని ఇస్తారు. పోస్టాఫీసులో "చైల్డ్ బెనిఫిట్" బుక్‌లో సైన్ చేసి ఆ డబ్బు తీసుకోవాలి. ఇక్కడ బిచ్చగాళ్ళు అసలు ఉండరనే చెప్పాలి. కాని లండన్‌లో "అండర్ గ్రౌండ్" స్టేషన్‌లలో సూట్టూ బూట్టూ వేసుకుని గిటార్ వాయించుకుంటూ స్టైలిష్‌గా అడుక్కుంటూంటారు అక్కడక్కడ.

ఇక్కడ "ఆసియా వాసులు" ఎక్కువగా ఉన్న చోటల్లా అడల్ట్ ఎడ్యుకేషన్ ఉంటుంది. ఇంగ్లీషు రానివాళ్ళకు వారానికి మూడు రోజులు, రోజుకు రెండున్నర గంటలు ఇంగ్లీషు నేర్పుతారు. అయితే ఈ క్లాసులకు జీతం ఇవ్వాల్సిన పనిలేదు.

ఇక్కడ యెన్ని సౌకర్యాలున్నా కూడా చాలామంది తెలుగువాళ్ళు ఇక్కడే స్థిరపడా లంటే ఇష్టపడరు. ఎప్పుడెప్పుడు ఇండియాకు పోదామా అన్నట్లుంటారు !

— హేమ [లూటన్, యు. కె]

## క్యాన్సర్ వ్యాధి కుదురుతుందా ?

సాలీనా రెండు లక్షల మంది క్యాన్సర్ రోగులకు వ్యాధి నయం చేయబడుతూన్నదని మాస్కోలోని ప్రజా శాస్త్ర పరిశోధనా కేంద్రం డైరెక్టరు బోరిస్ పీటర్‌సన్ చెప్పారు. ఈ క్యాన్సర్ వ్యాధి అనేక రూపాలలో వుందని ఆయన అన్నారు. అదిలోనే జబ్బును కనుగొనడం, నూతనచికిత్సా పద్ధతులను అనుసరించడం, సమర్థవంతమైన మందులను వాడడం వల్ల ఈ వ్యాధి నివారణ సాధ్యమని ఆయన చెప్పారు. ఇక మీదట క్యాన్సర్ జబ్బు నయం కానిదిగా వుండదన్నారు. అయితే ఈ వ్యాధిని పూర్తిగా అదిగమించేందుకు సమస్త ప్రపంచంలోని ప్రజా శాస్త్రవేత్తలు కలిసి కృషిచేయడం అవసరమని ఆయన అన్నారు.

# శిలలో స్పందన

ఎమ్.డి. సౌజన్య




కారు చీకట్లో కాళీమాత నాలికలా మెరిసిపోతోంది, ఔటరులోని ఎర్ర సిగ్నలు లైట్!

అంత వరకు పరుగులు పరుగులతో వచ్చిన హౌరా ఎక్స్‌ప్రెస్, ఆ ఎర్ర సిగ్నల్ను చూసి, కరిచే అలవాటున్న తెగ దూడలా ఒక్కసారి భయపడ్డట్టు అరచి, చిరాటు నొక్కినట్టు ఆగిపోయింది!

పాత సామానులతో కిక్కిరిసిపోయి కిటకిటలాడుతున్న పొడుగది వుంది, చివరి జనరల్ కంపార్ట్‌మెంట్!

రైలు పెద్దకుదుపుతో ఆగటంతో, అంతవరకు జోగుతున్నట్టు నిద్రపోతున్న జోగులు, తను చేయవలసిన పని మరోసారి గుర్తుచేసుకున్నాడు!

'ఛీఛీ ఎప్పుడూ లేనంత రద్దీగా వుంది-కంపార్ట్‌మెంట్! నాది మోపే సందుకూడా లేదు... ... ఇక నావని సానుకూలమయ్యే పెట్టెక్కడ!? ఇవాల్టికి ఈ బండిలో ... ... అలా లేనట్టే!'' అనుకున్నాడు జోగులు విస్పష్టంగా నిరాశ ... నిస్పృహ, పరిసరాల్లో ఆవహిస్తుండగా.

జోగుల్ని చూస్తే ఎవరూ అనుమానించరు!

మాసిన పెద్దవిలువ బొట్టు, చిరిగి గడ్డం, మెడక్రిందకు వ్రేలాడే కురులు, ఆపాదమస్తం కాషాయాలు, చేతిలో కమండలంతో నూనగుల దృష్టిని ఆకర్షించటానికి "జై! కృష్ణ పరమాత్మ! ...జై ... కృష్ణపరమాత్మ!" అంటుంటాడు.

దీనికి తోడు మోచేతి వరకూ విరిగిన కాడి చేయి కదుపుతూ దీనంగా, జాలిగా హృదయం గ్రవించేట్టు "జై కృష్ణపరమాత్మ! జై కృష్ణ పరమాత్మ!" అంటూ దానం అడుగుతాడు.

సాధువని, పైగా అవిటి వాడని చాలా మంది తమకు తోచింది అతని కమండలంలో వడేస్తారు.

ఆ రోజు జోగులు రైలు పెట్టెలో ఎక్కటానికి ఎక్కడ ప్రయత్నించినా— ఇవాగిల్లా ముసిరి వున్న కంపార్ట్‌మెంట్ లోకి ఎవరూ ఎక్కనివ్వ లేదు!

"లోపల కెళ్ళే సందే లేదు! ఇంకా మనవెక్కి అడుక్కునేదెక్కడ?" — అని కొందరంటే, "టిక్కెట్టున్నవాళ్ళకే గతి లేదు! ఇక బైరాగి ఎక్కేదెక్కడ?" అని కొందరు వ్యంగ్యంగా అన్నారు.

ఇలాంటి చీదరింపులు, ఛీత్కారాలు జోగులుకు అలవాటే!

ఆ గుంపులో ఇలాంటి మనుషుల మధ్య నూటికి కోటికి, గంజాయి వనంలో తులసి మొక్కలా— "పాపం అవిటి సాధువు! చిల్లరో కాస్త ధర్మమివ్వండి!" అనే పుణ్యాత్ములూ వుంటారు.

ఆ రోజు జోగుల పరిస్థితి అలాగే అయ్యింది!

మొదట్లో— దడికట్టినట్టు దట్టంగా సర్కస్ చేస్తున్నట్టు తలుపు ప్రక్కన వ్రేలాడుతున్న జనం జోగుల్ని చూసి జాలి పడలేదు.

ఇక అప్పూటి తను ఆ ట్రెయిను ఎక్కే వీలే లేదు అనుకుంటున్న జోగుల మీద జాలి పడ్డ ముసలి ముత్తైదువు, దాదాపు అందరితో పోట్లాడి, కొందరిని నెట్టి, మరి కొందరిని కసురుకుని, "అవిటి సాధువుని రానివ్వండి బాబూ!" అంటూ చేయూతనిచ్చి లోపలికి వచ్చే వీలు కల్పించింది.

"దండాలమ్మా! ఈ వేళ నువ్వు పుణ్యం గట్టుకోకపోతే..." అంటూ జోగులు తన

# అన్నిటికన్నా తక్కువ ధరకు
# అన్నిటికన్నా ఎక్కువ శుభ్రత




ఇతర అన్ని డిటర్జెంట్ బార్లకంటె ఎంతో ఎక్కువ ఉత్తమమైనది, ఎంతో ఎక్కువ ఆదానిచ్చేది మరియు సబ్బులకంటె 1½ రెట్లు ఎక్కువ శక్తివంతమైనది.

## నీలి రంగు స్వస్తిక్ డిటర్జెంట్ ఉతుకే బార్

ఒక మారు స్వస్తిక్ బార్...మరి ఎప్పటికీ స్వస్తిక్ బార్

# శిలలో స్పందన

కృతజ్ఞతలు తెలుపుకున్నాడు. తనను లోపలికి రప్పించిన ముసలి ముత్తయిదువు ముఖం చూశాడు, జోగులు.

నుదుటి కుంకుమ బొట్టుతో, నెరసిన తెల్లటి తలతో, తెల్లటి ఖద్దరు చీర రవికతో. ఒక పెద్ద ట్రంకు పెట్టె ఒక మూలగా పెట్టుకుని "ఇక్కడ కూర్చోండి బాబూ!" అంది, ఆప్యాయత ఉట్టిపడేట్టు.

ఆ ముసలమ్మను చూస్తూనే, మా అమ్మ బ్రతికుంటే అచ్చం యిలాగే వుండేది ...కాబోలు! అనుకున్నాడు జోగులు.

ఆ మాటల్లో ఎంత ఆత్మీయత, ఎంత ఆప్యాయత, ఎంత ఆర్ద్రత!

ఆ పలకరింపులో ఎంత చల్లదనం! ఎంత లాలింపు! ఏదో యాంత్రికంగా జోగులు సమాధానం చెప్పాడు!

ఎందుకో మొదటిసారి జీవితంలో తను అబద్ధం చెబుతున్నట్టు జోగులు, నేరస్థుడిలా బాధపడ్డాడు!

అలవాటు పడ్డ అతని కళ్ళు, అతని పని ఇక్కడ సానుకూలం అవుతుందోనని వెదుకుతూ చూస్తున్నాయ్!

ఇంతలో ముసలి ముత్తయిదువు 'కూర్చో బాబూ! నీ తల్లిలాంటిదాన్ని!' అంటూ తను జరిగి జోగులికి కూర్చునే స్థలమిచ్చింది, ట్రంకు పెట్టె మీద.

జోగులు, ఆ ముసలమ్మ ప్రక్కనే, ఆమె పెద్ద ట్రంకు పెట్టె మీదే ఇబ్బందిగా సర్దుకుని కూర్చున్నాడు.

క్రమేపీ యిద్దరి మధ్యా సంభాషణ ప్రారంభమయింది.

"పాపం... కాళ్ళూ చేతులూ సరిగా వుంటేనే యీరోజుల్లో గడవటం అంతంత మాత్రం! ఎలా జరిగింది బాబూ!?" అడిగింది ముసలమ్మ జోగులు కుంటి చేతిని ఉద్దేశించి.

ఇలాంటి ప్రశ్న యిలా పదిపన్నెండేళ్ళల్లో చాలా మంది అడిగారు! వాళ్ళ సానుభూతి కోసం... అందమైన అబద్ధాలు, చిలువలు పలువలు చేర్చి అనేక విధాలుగా — అడిగిన వాళ్ళ సానుభూతి లభించేట్టు కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ చెప్పేవాడు, జోగులు.

కాని మొదటి సారి — ఆ ముసలి ముత్తయిదువుకు నిజం చెబుదామనిపించింది జోగులుకు!

కాని... ఆ... నిజం... ఆ నిజం... ఎలా చెబుతాడు...!! ఆ నిజం... తెలిస్తే... ఆ నిజం... తెలిస్తే...! ?

* * *

అప్పట్లో... జోగులు పేరు... జోగారావు! ఇంట్లో అలిగి చిన్న వయసులోనే మిలిటరీలో చేరాడు జోగారావు.

డెహ్రాడూన్ మిలిటరీ కంటోన్మెంట్‌లో వుండే జోగారావుకు మొదట్లో మిలిటరీ క్రమశిక్షణ, అలవాట్లు, నియమాలు కష్టంగా వున్నా — క్రమేపీ అలవాటు పడిపోయాడు. మిలిటరీలో వున్నట్టు అతను ఏ రోజూ తల్లిదండ్రులకు కనీసం ఉత్తరం కూడా వ్రాయలేదు. మెల్లిగా ట్రక్ డ్రైవింగ్ నేర్చుకుని, మిలిటరీ స్టోర్సుకు సంబంధించిన ట్రక్కును నడిపే పనిని అలవాటు చేసుకున్నాడు.

ఇలా నిత్యకల్యాణం పచ్చతోరణంగా జీవితం సాఫీగా సాగిపోతే ఎలా ఉండేదో... అకస్మాత్తుగా పులి మీద పుట్రలా లడక్ ప్రాంతంలో చైనా సేనలు భారతభూభాగం మీదకు వచ్చి పడుతున్నట్టు వార్తలు అందసాగాయి.

అంతవరకూ ఎంతో ప్రశాంతంగా వున్న డెహ్రాడూన్ ప్రాంతంలో కలవరం బయలుదేరింది!

ఎక్కడ చూసినా యుద్ధవార్తలే! ఏ నోట విన్నా యుద్ధానికి సంబంధించిన చర్చలే! కొందరు పైకి ధైర్యవచనాలు పలుకుతున్నా ఎక్కువ మంది ముఖాల్లో భయం స్పష్టంగా కనిపిస్తోంది.

'ఇక మన బెటాలియన్ని లడక్ ప్రాంతానికి బయలుదేరమని వార్తలు రావచ్చు త్వరలో!' ఒక మేజరు మరో మేజరుతో మిలిటరీ స్టోర్‌లో అనుకుంటుండగా విన్నాడు జోగారావు.

జోగారావు అమాయకంగా ఒక సుబేదార్‌ని అక్కడికి అడిగాడు, 'యుద్ధరంగానికి ... ... నా బోటి ట్రక్ డ్రైవర్లు వెళ్ళవలసి వుంటుందా — సాబ్? అని.

"ఆర్మీకి ఆహారం సరఫరా సకాలంలో అందజేయటానికి అందరికంటే ముందుగా యుద్ధప్రాంతానికి చేరవలసింది మీరే?" చెప్పాడు సుబేదార్ నవ్వుతూ.

ఆ సుబేదార్ ముఖం ఎందుకనో జోగారావుకు చాలా భయంకరంగా, వికృతంగా కనిపించింది.

ఆ నవ్వులో... ఎన్నో అర్థాలు... "ఓరి పిరికివాడా!?" అనే వెక్కిరింపు ధ్వనించాయి జోగారావుకి.

యుద్ధ రంగానికి వెళ్ళటమంటే మృత్యు ముఖంలోకి వెళ్ళటమే!

"పెళ్ళి పేటాకులు కాలేదు. జీవితంలో అనుభవించిందీ... ఆనందించిందీ ఏం లేదు. అయితే అప్పుడే నేను మృత్యు ముఖంలోకి పోవటమా? అప్పుడే నాకు నూరేళ్ళు నిండటమా?" అనుకున్నాడు జోగారావు బాధగా.

ఆ క్షణం నుంచే అతనికి మిలటరీ అన్నా మిలటరీ జీవితమన్నా భయం!! ఏ క్షణాన యుద్ధ ప్రాంతానికి బయలుదేరమని వర్తమానం వస్తుందోనన్న దిగులు పట్టుకుంది!

"అసలు శత్రు విమానాలు పైనుంచి బాంబులు వేసేది యుద్ధరంగానికి ఆహార పదార్థాలు సరఫరా చేసే– లారీలమీద– ట్రక్కులమీదే!" అన్నమాట గుర్తు చేసుకుంటేనే గుండెల్లో గుబులుపుట్టి వళ్ళంతా చెమటలు పడుతుంది జోగారావుకి.

అనుకున్నట్లుగానే జోగారావుకి మిలటరీ ట్రక్కులో పాలపొడి డబ్బాలు వేసుకుని బయలుదేరి లడక్ ప్రాంతానికి చేరమని ఆర్డర్సు వచ్చాయి.

అంతే! జోగారావు ప్రాణాలు పైనే పోయాయి. ట్రక్కుతో బయలుదేరుతూనే జోగారావు తను చేయవలసినదేమిటో నిర్ణయించుకున్నాడు.

రాత్రి డెహరాడూన్ నుంచి ట్రక్కులో బయలుదేరగానే తనతో పాటు ఉండే నుబేసింగ్‌కు చెప్పాడు "భయ్యా! రాత్రి పన్నెండు వరకు నేను డ్రైవ్ చేస్తాను... ట్రక్! అంతవరకు నువ్వు నిద్రపో...!! తరువాత... నిద్రపోవటం నా వంతు... డ్రైవింగ్ నీ వంతు!" అంటూ.

ట్రక్ కొంత దూరం పోయి డెహ్రాడూన్ ఊరు బయటకు వస్తూండగా ఎవరో "ఆపండి... ట్రక్... ఆపండి!" అంటున్నట్లు చెయ్యి ఊపుతూ ట్రక్కును ఆపించాడు.

"సింగాల్‌కోట్ క్యాంప్‌కి రిపోర్ట్ చేయాలి! నేనూ మీ ట్రక్కులో వస్తాను!" అన్నాడా మనిషి, హిందీలో.

వెతకబోయిన తీగ కాలికి తగిలినట్లని పించింది జోగారావుకు.

"ఆయియే! ఆయియే!" అంటూ ఆప్యాయంగా ఆహ్వానించి, కేబిన్‌లో తన ప్రక్కనే కూర్చోబెట్టుకున్నాడు జోగారావు. మాటల సందర్భంలో అతనూ ఆంధ్రుడనే తెలిసింది. ఇద్దరూ సంతోషంగా మాతృ భాషలో మాట్లాడుకున్నారు.

"ఈ యేడే ఇంకో నెలలో రిటైర్ అయ్యేవాణ్ణి...!! తమాషాగా యుద్ధం వచ్చింది! మాతృదేశ సంరక్షణ కోసం యుద్ధ రంగంలో పోరాటం సాగించటం కంటే సంతోషదాయకమైన పని ఏముంటుంది ఒక సిపాయికి?" అన్నాడతను గర్వంగా.

ఆ మాటలంటున్నప్పుడు అతనిమాటల్లో ధ్వనించిన ఆత్మ విశ్వాసం, సిపాయిగా అతనికున్న కృతజ్ఞతా భావం, అతని ధ్యేయం జోగారావుని విచలితుణ్ణి చేసినయ్!

"ఎంత మంచి మనిషివి... తను... స్వార్థంతో...!" అనుకున్నాడు జోగారావు బాధగా.

చివరికి స్వార్థమే జయించింది!

మాటల మధ్యలో జోగారావు ఆ వ్యక్తి పేరు విశ్వమని తెలుసుకున్నాడు. అతనికి గంజాయి కలిపి తను తాగటానికి చుట్టుకున్న చుట్టముక్క యిచ్చాడు. ఇద్దరూ పిచ్చాపాటీ చాలా ప్రొద్దుపోయే వరకూ మాట్లాడుకున్నారు.

విశ్వం ఎప్పుడు నిద్రలోకి జారుకున్నాడో గురక వినిపించటంతో మెల్లగా జోగారావు తన కార్యక్రమంలోకి దిగాడు.

మొదట అతని చొక్కాకి భుజంమీద వుండే ఐడెంటిటీ నంబరు మెల్లగా తీసి తన భుజానికి తగిలించుకొని, తన నంబరు అతనికి తగిలించాడు.

ఎత్తుగా వున్న దిబ్బమీదికి ట్రక్ ఎక్కి దిగుతుండగా, ట్రక్ సరాసరి వెళ్ళి లోతుగా వున్న లోయలో పడేట్టుగా స్టీరింగ్ తిప్పి ఆ మాత్రం బయటికి దూకాడు జోగారావు. అయితే అతను దురదృష్ట వశాత్తు అతను మూటలా పెద్ద బండ రాయి మీద పడటంతో, అతని కుడిచెయ్యి కొంత భాగం విరిగిపోయింది. అంత బాధ లోనూ– విశ్వం తన బదులుగా చనిపోవటం అతనికెంతో ఊరట కలిగించింది. తరువాత తను చేసిన నేరాన్ని కప్పిపుచ్చటానికి తను జోగులుగా సాధువు రూపంలో కొత్త అవతారమెత్తవలసి వచ్చింది, జోగారావుకి.

నుజ్జుయి పోయిన కుడిచెయ్యి మోచేతి వరకు తీసివేయటంతో జోగులెలాగో బతికి బ్రతికాడు.

ఆ తరువాతే అతని బ్రతుకు దుర్భరమైంది. కుడిచెయ్యి లేకపోవటంతో అతను ఏపని చేయ్యలేక తన పొట్ట తను పోసుకోలేనని అర్థం చేసుకున్నాడు. చివరికి మరో మార్గం లేక ఇలా సాధువులా క్షేత్రంలో భిక్షాటన ప్రారంభించాడు.

అప్పుడే తెలుసుకున్నాడు, అలా సంపాదించిన సంపాదన అసుబసుగా ఆకలికి అడ్డం వేయటానికి తప్ప సరాలకి సరిపోదని.






# రికరి® ఇన్‌స్టెంట్




ఇది ఫిల్టర్
కాఫీ వలెనే యెంతో
రుచిగా ఉంటుంది కాబట్టి
తేడాచెప్పడం చాలాకష్టం.

నెస్ కఫే ఉత్పత్తిదార్లనుండి-ప్రపంచమంతటా కాపీ శ్రేష్టత తెలిసినవారు

SAA/FSL/R/1135

ములకనగ విప్పుకోకు. నీగురించికాదు, ఇటువంటి విషయాలలో నీతల్లి, నీచెల్లెలు భవిష్యత్తు కూడ కొంత ఆలోచించుకో భాస్కర్! నిమ్మనువ్వు మార్చుకుంటే నాకు తెలియజెయ్యి — సంతోషిస్తాను. వెళ్ళొస్తా వదినా, చెల్లీ నీకెప్పుడు నా అవసరం కలిగితే ఉత్తరం వ్రాయి, తప్పకుండా వస్తా. నేను నీకెప్పుడూ అన్నయ్యనే!! పరిస్థితులు ఎలా మారినా నేను నాతత్వం మార్చను — సరేనా?"

జగదాంబ, విశ్వనాథం వెళ్ళిపోయారు. ఆరోజంతా విమలమ్మ భోజనం చేయలేదు. మర్నాడు కోమలి ప్రాధేయపడగా భోజనం చేసింది.

## 14

తరువాత కోమలి ఎంతో చెప్పింది అన్నయ్యకు, గాని భాస్కర్ పట్టుదల విడనలేదు. జనార్దనస్వామి, అన్నపూర్ణమ్మ వాళ్ళింటికి మేనమామ, మేనత్త రావడం యేదో ఘర్షణ పడడం తెల్సుకున్నారుగాని ఎవరింటి విషయాలు వాళ్ళే విమర్శించుకుని నిర్ణయించుకోవాలని పట్టించుకోలేదు. పదిహేను రోజుల తరువాత జనార్దనస్వామి ఆ పెండ్లి ప్రస్తావన విమలమ్మ దగ్గర తెచ్చాడు.

"బాబుగారు — అబ్బాయి మీ అమ్మాయినే చేసుకుంటానంటున్నాడు. వాడి ఇష్టమే మాకు కావాల్సింది. మీరే ముహూర్తం పెట్టించి చెప్పండి. ఈ ఇంట్లోనే ఆ శుభకార్యం జరిపిస్తాను."

"అమ్మా! మరి ఇచ్చిపుచ్చుకోవడాల సంగతి చెప్తే బాగుంటను"

"నాకుగాని, మా అబ్బాయికిగాని మీరేమి యివ్వక్కరలేదు."

"అంటే!"

"మా వారి ఆదర్శమది. పిల్లడి పెండ్లికి కట్నాలు, కానుకలు పుచ్చుకోవద్దని ఆయన అనేవారు. అందుకే ఆయన ఆత్మశాంతికి, సాతృప్తికి ఆయన ఆదర్శం పాటించదల్చాను."

"అమ్మా! పోనీ, ఈ వివాహానికయ్యే ఖర్చంతా నన్ను భరించుకోనీండి."

"అదెలాగండి అన్నయ్యగారు — నేను కోడలికి తులమెత్తయినా నగ పెట్టాలిగా! పైగా బట్టలకని, వ్రతానికని అయ్యేఖర్చు అంటే, సాంప్రదాయ సిద్ధంగా మొగపెండ్లి వారికయ్యే ఖర్చును నేను భరించుకుంటాను. ఆడపెండ్లి వారికయ్యే ఖర్చును మీరు పెట్టుకోండి."

"సరేనమ్మా, మీ ఇష్టప్రకారమే కానీండి. మీ ఆదర్శానికి నేనెంతో ఆనందిస్తున్నా! మీవంటి గౌరవమైన కుటుంబంతో బాంధవ్యమేర్పడుతున్నందుకు నాకెంతో గర్వంగా వుంది."

విమలమ్మ ఇంటి ఖర్చులకని గత సంవత్సరం రెండువేల రూపాయలు జనార్దనస్వామి వద్ద అప్పుగా తీసుకుంది. బ్యాంకు వాళ్ళు పుచ్చుకునేటట్లు నూటికి సంవత్సరానికి తొమ్మిది రూపాయిలే వడ్డీ రాయించారు. ఇంటద్దె ఏభైరూపాయలుతప్ప మరే ఆదాయం లేదు. కోమలి టైపు లోయరు పాసయింది. టైపు హయ్యరుకు కడుతుంది. పిల్లలిద్దరికీ ఏ వుద్యోగం దొరకలేదు. మధ్యతరగతి గౌరవనీయమైన కుటుంబాలకు చెందిన వ్యక్తులు సినిమాలలో సాధారణంగా చూపించినట్లు రిక్షా తొక్కి ఆర్జించడమన్నది అంతసులువుగా జరిగేపని కాదు. భాస్కర్ ఈ జన్మకా పని చెయ్యలేడు. చెయ్యడు.

పోనీ ట్యూషన్లు చెప్పుకుని బ్రతుకుదామంటే, అందరు అనుకునేటట్లు ట్యూషన్లు అంత సులువుగా దొరకవు. ఏ స్కూల్లో పని చేస్తున్నాడో, ఆమేస్టరు దగ్గరే ఆ స్కూలు పిల్లలు ట్యూషన్లు చెప్పించుకుంటారు. కాలేజి విద్యార్థులు ఆయా కాలేజి లెక్చరర్ల దగ్గరే ప్రయివేట్లు చెప్పించుకుంటారు. ఒకవేళో [illegible] మప్పుదుండదు. అందుకే కొందరు లెక్చరర్లు, మాస్టరు రెండు విధాల గడిస్తారు. పైగనిట్టాడుస్తారు. ఇటువంటి పరిస్థితులలో భాస్కర్, కోమలి వంటి నిరుద్యోగులకు ఈ ట్యూషన్లు దొరకడం కూడ దుర్లభమే

విమలమ్మ ఎంతసాదువుగా ఇంటిని నడుపుదామన్నా నెలకు వచ్చే ఏభై రూపా



యల ఇంటిదగ్గరైకాక మరో మూడు వేలై ఖర్చవుతోంది. అందుచేత మెల్లగ ఇంటి మీద అప్పుతెస్తూ కాలం గడుపుతోంది.

విమలమ్మ పెండ్లి ఖర్చుకోసమని, ఇంటి ఖర్చుకని మరో మూడు వేలకు పత్రంరాసి జనార్దనస్వామి వద్దే డబ్బు తీసుకుంది. జనార్దనస్వామి రిటైరయి వచ్చిన వ్యక్తి. గ్రాట్యుయిటీ డబ్బు, ఇన్సూరెన్సు డబ్బు, ప్రావిడెంటుఫండు అన్నీ కలిపి సుమారు ఏభై వేలు నగదుతెచ్చి బ్యాంకులో వేసుకున్నాడు. విమలమ్మకు డబ్బు ఇవ్వడంలో అతనేమి జంకడంలేదు. విమలమ్మ ఇల్లు అమ్మేస్తే తనే కొనుక్కుందామన్న కోరిక లేకపోలేదు. పైగా విమలమ్మ కొడుకు తనకు అల్లుడు కాబోతున్నాడు. పైస కట్నంలేకుండా దొరుకుతున్న అందమైన గ్రాడ్యుయేటు అల్లుడు. ఒకవేళ విమలమ్మ డబ్బును తీర్చకపోయినా ఫరవాలేదనుకున్న ఉదారుడు జనార్దనస్వామి. ఆ మూడు వేలతో కలిపి, చివరికి మొత్తం అయిదు వేలు అప్పతీసుకుంది విమలమ్మ.

పెండ్లి చాలా సింపుల్ గా ఆ ఇంట్లోనే జరిగిపోయింది. ఇది మాఇంటి రివాజని చాలమట్టుకు ఖర్చునంత జనార్దనస్వామే భరించాడు. పెండ్లికి శ్రీదేవి మేనమామ ఉగ్రనరసింహారావు వచ్చేడు టాటా నుండి కుటుంబాన్ని తీసుకుని. విమలమ్మ తరఫున తోటికోడలు రామలక్ష్మమ్మ, ఆమె చిన్న కూతురు మణి, విమలమ్మ అన్న విశ్వనాధం వచ్చారు. రాఘవరావుగాని అతడి కుటుంబం

# జీవితగమ్యం

గాని రాలేదు. అలాగే జగదాంబ, పిల్లలు రాలేదు. మనస్సులో ఏ ద్వేషము పెట్టుకోక మగపెండ్లి వారి పెద్దగ విమలమ్మ కోరికపై వ్యవహరించి, విశ్వనాథం ఆ వివాహాన్ని సవ్యంగా జరిపించాడు. భాస్కర్ మామయ్య నిర్మలమైన మనసుకు ముగ్ధుడైపోయాడు.

“మామయ్యా! నీకుకష్టం కల్గించాను, నన్ను క్షమించు నీకు నేను ఏ విధమైన సహాయం చెయ్యలేక పోయాను”

“చాలిరా భాస్కర్ — క్షమాపణలతో ఒరిగేదేమిలేదు కాని నీ తల్లిని చెల్లెలిని మాత్రం ఆదరంగా చూసుకోవడం మర్చిపోకు. నేను పండిన ఆకుని, ఏనాడో రాలిపోతాను. నువ్వుమాత్రం నీ వాళ్ళను ఆదుకోవాలి.”

“తప్పకుండా మామయ్యా! నాతల్లికిగాని, నా చెల్లెలికిగాని ఎట్టి కష్టం కలుగకుండ చూసుకుంటాను.”

పెండ్లయిన మూడవరోజున శ్రీదేవి మేనమామ ఉగ్రనరసింహారావు కుటుంబాన్ని తీసుకొని టాటా వెళ్ళిపోయాడు. ఓ నెల్లాళ్ళలో మంచి ఉద్యోగం ఏర్పాటు చేసి ఉత్తరం వ్రాస్తానని, అప్పుడు టాటా రమ్మని భాస్కర్‌కి చెప్పి వెళ్ళిపోయాడు. భాస్కర్‌కి చాల ఉల్లాసంగవుంది— శ్రీదేవి భార్యగ దొరికిందని, త్వరలో మంచి ఉద్యోగం రానున్నదని. విమలమ్మ, కోమలి పెండ్లితో సరదాగానే వ్యవహరించారు. విమలమ్మ ఎవరు చూడకుండా భర గదిలో కూర్చుని, ఇటువంటి ఆనంద సమయంలో భర్త లేనందుకు భర్తను తల్చుకుని దుఃఖించింది.

పెండ్లయిన తరువాత ఓ నెల్లాళ్ళు కొత్తకోడలు విమలమ్మ ఇంట్లోనే వుంది. అత్తగారిక్కి పనుల్లో సహాయంచేస్తూ చాల కలివిడిగా ఉండేది. విమలమ్మ కోడలు సహృదయతకు ఎంతగానో సంతోషించింది. శ్రీదేవి మంచి ప్రవర్తనకు ముఖ్యంగ కారకులు జనార్దనస్వామి, అతడి భార్య అన్నపూర్ణమ్మ. అసలు విమలమ్మ ఎన్నికష్టాలు పడి పిల్లల్ని అంతవాళ్ళను చేసిందో, యవ్వనంలో భర్త విహీన అయినా విమలమ్మకు ఎంత సానుభూతి అవసరమో శ్రీదేవికి బాగా నచ్చచెప్పారు. వారిమాటల్ని అనుసరించే శ్రీదేవి ప్రవర్తించింది. భర్త అయిన భాస్కర్‌ని ఎంతో ప్రేమగ చూసుకునేది.

ఇలా ఆనందంగ నెలాపదిహేను రోజులు గడిచేసరికి, భాస్కర్‌ని వెంటనే టాటా రమ్మని శ్రీదేవి మేనమామ వద్దనుండి ఉత్తరం వచ్చింది. భాస్కర్ ఆనందంతో సర్టిఫికేట్లన్ని తీసుకుని, తల్లి దీవనల్ని అందుకుని టాటానగర్‌కి ఆ మరునాడే ప్రయాణమయ్యాడు. భాస్కర్ వెళ్ళిన పది రోజులకే అతడి వద్దనుండి శుభవార్త వచ్చింది—అతడికి టాటా కంపెనీలో స్టోరుకీపరుగా నెలకు అయిదు వందల రూపాయల జీతంపై ఉద్యోగమైందని. ప్రస్తుతం శ్రీదేవి మేనమామ ఇంట్లో ఉంటున్నాను, కొద్ది మాసాలలో తనకు విడిగ ఇల్లు దొరకగానే తల్లిని, చెల్లెల్ని తీసుకుని వెళ్తానని వ్రాశాడు.

భార్యకు వ్రాసిన ఉత్తరంలో తాను ఎంత విరహవేదన అనుభవిస్తున్నది వివరంగ వ్రాసి, త్వరగ శ్రీదేవిని టాటా వచ్చేయమని వ్రాశాడు. వారం రోజుల తరువాత జనార్దనస్వామికి, అతడి బావమరిది ఉగ్రనరసింహారావు నుండి ఒక ఉత్తరం వచ్చింది. అతడి బంగళా చాల పెద్దదని, ప్రస్తుతం భాస్కర్, శ్రీదేవి ఉండటానికి ఆ ఇంట్లోనే రెండు గదులు కేటాయించాడని వెంటనే శ్రీదేవిని టాటా పంపమని వ్రాశాడు. ఆ ఉత్తరం జనార్దనస్వామి విమలమ్మకు

తెలిస్తే! సినిమాల్లోకి కొత్తవాళ్ళు పనికిరారండీ! మూడేళ్ళక్రితం కొత్తనటులతో ప్రారంభిస్తే— పెండ్లిసీను తర్వాత హీరోహీరోయిన్లు హనీమూనంటూ వెళ్ళి ఇంతవరకూ రాకుండా నాచిత్రాన్ని నిలిపేశారు!



చదివి వినిపించి ఆమె ఉద్దేశమడిగాడు.

"అన్నయ్యగారూ! మా కోడలు మా అబ్బాయి దగ్గరకు వెళ్ళడానికి నా అభ్యంతరమేమీ లేదండి. కొత్త దంపతులు, వాళ్ళిద్దరు ఒక దగ్గిర ఉండడమే మంచిది. మంచి చూసుకుని అలాగే పంపించండి." అని సమ్మతిని తెల్పింది. శ్రీదేవి ఆనందంతో ఆనాడు పనుల్ని మరీ చురుకుగా చేసింది.

అయిదురోజుల తరువాత శ్రీదేవి టాటా నగర్ వెళ్ళిపోయింది.

## 15

కొడుకు వెళ్ళిపోయిన తరువాత ఇల్లు బోసిగ అయిపోయింది. విమలమ్మకు ఏదో బాధ పట్టుకుంది. అందరూ తనకు దూరమైపోతున్నారన్న భావన పీడించడం మొదలైంది. విమలమ్మ భర్తపోయిన మొదటి సంవత్సరమంతా బయటకే దుఃఖించింది. తరువాత మనసులో దుఃఖించటం చేసేది. ఈ దుఃఖంవల్ల ఆమె గుండెలో పోటు మొదలైంది. ఆ పోటు ఓ వ్యాధిగా పరిణమించి, అప్పుడప్పుడు ఆమెను బాధిస్తుండేది. అందుకే ఆమె త్వరగా కోమలికి వివాహం చేయ సంకల్పించింది. తెల్సినవాళ్ళందర్కీ చెప్పింది, ఏదైన మంచి సంబంధం చూసిపెట్టమని. రామకృష్ణకు, విశ్వనాధంకు ఉత్తరాలు వ్రాసింది, తమకు తెల్సిన ఏమైనా సంబంధాలుంటే చూడమని. విమలమ్మ బెంగంతా తను ఈ గుండెపోటుతో ఎక్కువ కాలం బ్రతకలేదని, ఒకవేళ తను పోతే కోమలికి వివాహం ఎవరు చేస్తారని.

సత్యం తను పనిచేస్తున్న మోటారు షెడ్డు పనిమీద యజమాని పంపగా ఆ ఊరు వచ్చాడు— ఏవో లారీల భాగాలను కొనడానికి. సత్యం బాగానే ఎదిగాడు. మనిషి పొడవుగా, సన్నగా ఉన్నాడు. కోమల్ని చూసి ఆశ్చర్యపోయాడు. కోమలి అందానికి పరవశుడయాడు. విమలమ్మింటికి వచ్చిననాడు రెండు రోజుల పనని వచ్చాడు. ఇప్పుడు కనీసం అయిదు రోజులుండదల్చాడు. అన్నకొడుకుని విమలమ్మ ఆదరంగా సత్కరించింది. కోమలి బావా అని సరదాగా పిలిచేది.

"ఏం మరదలుపిల్లా— చిన్నప్పుడునిన్ను కొట్టేనని కోపం లేదుకదా?"

జీవితగమ్యం

"నాకేం జ్ఞాపకం లేదే— ఎప్పుడు కొట్టావు, ఎందుకు కొట్టావు?" చిలిపిగ అడిగింది.

"జ్ఞాపకం లేకపోతే మరీ మంచిది." సత్యం తప్పించుకున్నాడు.

సత్యం మేనత్తకి యింటి సంగతులు వివరంగా చెప్పాడు. తండ్రి ఆరోగ్యం అంత బాగుండటంలేదని, పెద్దక్కయ్యకు కొడుకు పుట్టాడని, రెండో అక్క అత్తవారింట్లో ఉందని, చెల్లి సరోజకింకా పెండ్లి కుదరలేదని, తను నిడిగా ఓ షెడ్డును పెట్టుకుందుకు ఆలోచన చేస్తున్నాడని, వాళ్ళ నాన్న వాడికోసం ఏవో పెండ్లి సంబంధాలు చూస్తున్నాడని, అప్పుడే తను ముగ్గురు పిల్లల్ని చూసాడని, ఎవ్వరు నచ్చలేదని చెప్పాడు. ఈ ఆఖరి విషయం చెప్తున్నప్పుడు కోమలి కండ్లలోకి చూసాడు.

కోమలికి ఆ విషయమే అర్థం కాలేదు. సత్యం సన్నగా పొడుగ్గా ఉంటాడు. ఛామన ఛాయ. స్కూలు ఫైనల్ ఫెయిల్డ్. కార్లు రిపేరు చేసే షెడ్డులో మెకానిక్కు. అట్లాంటి వాడికి ఆమ్మాయి నచ్చకపోవడమేమిటి! పెంకితనంగా ఆ మాటే మధ్యాహ్నం అడిగింది.

"చూడు కోమలి— పెండ్లికూతురంటే నీలాగుండాలి. పెద్ద కండ్లు, సంపంగి లాంటి ముక్కు, ముత్యాల్లాంటి పలువరస......"

"బావా! ఆగు, ఆగు. వర్ణన చాలించు. అర్థమయిపోయింది. సరే నేను ప్రయత్నిస్తా! నాలాంటి అమ్మాయి దొరకగానే నీకు తెలియజేస్తాలే."

"పోనీ నామాట వింటావా— ఒకటి చెప్తా."

"ఒక్కటేం ఖర్మ, బోలెడన్ని చెప్పు— వింటా."

సత్యం తటపటాయించాడు, కాని చెప్పలేక పోయాడు.

"మరోసారి చెప్తాలే".

కోమలి సత్యం ముఖంలోకి చూసింది. మొదటిసారిగ కొన్త అనుమానం కలిగింది.

సత్యం మేనత్తింటికి ప్రయాణమవుతుంటే జగదాంబ చెప్పింది—

"ఒరే సత్యం! నీ మేనత్త కూతురు అందమైన పిల్ల. పి. యు. సి. పాసైంది. చాల చురుకైనది. నువ్వు ఆ అమ్మాయిని పెండ్లాడితే నువ్వు అదృష్టవంతుడివే. వీలుచిక్కితే కోమలిని అడిగి చూడు, దాని ఉద్దేశం కనుక్కో."

తల్లి చేసిన మంత్రోపదేశాన్ని సత్యం మరచిపోలేదు. కోమలి అభిమానాన్ని సంపాదించడానికి ప్రయత్నాలు మొదలెట్టాడు. ఒకనాడు యింటికి మిఠాయి కొని తెచ్చాడు. మరోనాడు పెద్ద మల్లెపూల చెండు తెచ్చిచ్చాడు. వేరేనాడు సాయంత్రం ఆరుగంటల ఆటకు కోమలిని పంపమని మేనత్తను కోరాడు.

"దానిష్టం నాయనా, అది వస్తానంటే తీసుకొని వెళ్ళు."

"ఏం కోమలి— నాతో రావూ?" కాస్త ప్రాధేయ పూర్వకంగానే అడిగాడు. కోమలికి జాలివేసింది.

"సరే— పద." చక్కగా ముస్తాబై బావవెంట సినిమాకు వెళ్ళింది. సత్యం పొంగిపోయాడు. సినిమా అవుతుంటే మెల్లగా కోమలి చెయ్యి పట్టుకున్నాడు.

(44వ పేజి చూడండి)

### అదేమిటి?

ఆరునూరుగా మారొచ్చు
నూరు ఆరుగా మారొచ్చు
ఈ దేశంలో
ఎన్ని ప్రభుత్వాలైనా మారొచ్చు
కాని, ఎన్నటికీ
మారని దొకటుంది

విలువలేనిది
ఎన్నికల ముందు
నాయకులు చేసే
తుచ్ఛ వాగ్దానం మాత్రమే కాదు
మరొకటుంది

అదేమిటంటే—
పరమాన్నం తిన గగన కుసుమమై
గంజినీరు త్రాగ రుచికరమై
కనీసం వస్త్రం కోసం
అప్పులు చేసి తిప్పలు పడే
మధ్యతరగతి మనిషి నికృష్టపు బ్రతుకు.

— "భగ్యాస్"

కలిసిపోతుంది తక్షణం న్యూట్రామల్
వేడి పాలలోలాగే చల్ల పాలలోనూ
'హై వేక్యూమ్ డ్రయింగ్' పద్ధతివలన తయారౌతాయి
త్వరగా కరిగే న్యూట్రామల్ గుళికలు







కొత్త 200
గ్రా. సీసా

అమూల్ వారి
న్యూట్రామల్



మార్కెట్ చేయువారు:
గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్
మార్కెటింగ్ ఫెడరేషన్ లిమిటెడ్
ఆనంద్ 388 001. గుజరాత్

daCunha-GCM-26.TL

# రాగస్మృతి అనుబంధం

కోడింగుంట రామచంద్రమూర్తి

(గత సంచిక తరువాయి)

14

తుళ్లిపడింది రాణి.

"ఔను రాణీ!... చేతులమీదా, కాళ్ళ మీదా ఏవో మచ్చలు బయల్దేరాయి. రక్తంలో మార్పు ఏదైనా రావటంవల్ల అలాంటి మచ్చలు వచ్చివుంటాయని అనుకున్నాను. స్కిన్ స్పెషలిస్టుకి చూపిస్తే కుష్టువ్యాధని నిర్ధారణ చేశాడు" - చొక్కా చేతుల్ని వెనక్కి మడిచి చేతులమీదనున్న మచ్చలు రాణికి చూపించాడు.

రాణికి ఒళ్లు జలదరించినట్లయింది.

"ఈ భయంకర వ్యాధి ముదరకుండా నీకు పెళ్లిచేసి పంపించేస్తే నా బాధ్యత తీరిపోతుంది. ఇక నేనేమైపోయినా నాకు దిగులుండదు." భానుమూర్తి మాటలు నిశ్చలంగా వున్నాయి.

"కానీ,నేను మా కాలేజీలో మోహన్రావుని ప్రేమించాను" తల ఒంచుకునే చెప్పింది రాణి.

"మోహన్రావా ?"

"అవును! బి. ఎ. ఫైనల్ చదువు తున్నాడు. నన్ను తప్పకుండా చేసుకుంటా నన్నాడు."

ఏదో అడగాలనీ, మరేదో చెప్పాలనీ అనుకున్న భానుమూర్తి 'అలాగా ?' అని మాత్రం అన్నాడు.

"వచ్చే సంవత్సరం బి. ఏ. అయిపోగానే ఎక్కడైనా ఉద్యోగంలో చేరి, వాళ్ళ వాళ్ళను ఒప్పించి నన్ను పెళ్లిచేసుకుంటానన్నాడు."

"అతన్ని ఓ రోజు మనింటికి భోజనానికి రమ్మను. నేను కూడా చూస్తాను" అన్నాడు భానుమూర్తి.

మరో ఆరునెలలు గడిచిపోయాయ్.

అప్పటికి వారం రోజులుగా పట్టిన ముసురు ఇంకా వదల్లేదు

భానుమూర్తి మనసంతా చిరాగ్గా వుంది. వేడివేడి టీ తాగితే బాగుండుననిపించింది. ఓసారి గోడ గడియారం వైపు చూశాడు. మరికొన్ని నిముషాల్లో నాలుగు కావటానికి సిద్ధంగా వుంది.

ఓ అరగంట ఎలాగో గడిపేస్తే— కాలేజీ నుంచి రాణీ వస్తుంది. వచ్చిన తరువాత టీ కలిపి ఇస్తుంది.

అంతవరకూ ఏం చేయాలో తోచలేదు. వయొలిన్ తీసి తరముగా రాణీ వాయించే దేవగాంధారి రాగాన్ని వాయించటానికి ప్రయత్నించాడు. కానీ ఎన్నో అపశ్రుతులు పలుకసాగాయి.

తానుకూడా వయొలిన్ నేర్చుకుంటే బాగుండు ననిపించింది అతనికా క్షణాన.

తన జీవితంలో — ఇక ముందు తనతో సాహచర్యాన్ని పంచుకునే వారు ఎవరూ ఎలాగా వుండరు. రాణీ కూడా పెళ్లి చేసుకుని భర్తతో వెళ్ళిపోతుంది. ఎన్ని మందులు వాడినా ముందు ముందు తన వ్యాధి బయటపడక మానదు

బయటి ప్రపంచం నుంచి దూరంగా— తానొక్కడూ తన చుట్టూ గిరి గీసుకుని— తన ప్రపంచంలో తాను బ్రతికే రోజు ఎంతో దూరంలో లేదు. తనకు కనిపిస్తోంది.

అప్పుడు —

ఆ ఏకాంతంలో, తనకంటూ ఓ వ్యాపకం కావాలి. అందుకే వయొలిన్ నేర్చుకుంటే, తన మనసుకు ప్రశాంతత కరువైనప్పుడు దానిపై పాటలు పాడుకో వచ్చు ననుకున్నాడు భానుమూర్తి.

చిన్నప్పటినుంచీ తనకు సంగీతమంటే ఎంతో ఇష్టం. ఎన్నోసార్లు రామదాసు తాత దగ్గరచేరి పాటలు పాడించుకుని విన్నాడు. అలా వింటున్నప్పుడు, ఆ పాటల్లోని భావానికి తాను కదిలిపోయేవాడు. ముఖ్యంగా ఆ పాట తానెప్పటికీ మరచి పోలేదు. రానురాను దాని ప్రభావం తన

**జరిగిన కథ – 8 :** చిన్నతనంలోనే తన తల్లిదండ్రులను కోల్పోయి, ఉన్న వూరు వదలి హైద్రాబాద్‌లో తన అక్క దగ్గరుంటున్న భానుమూర్తి, ఇల్లు అమ్మకం విషయంమీద తిరిగి ఆ వూరు వస్తాడు. అక్కడి ప్రదేశాలను చూస్తుంటే అతనికి గతస్మృతులు జ్ఞప్తికి వస్తూంటాయి. భానుమూర్తిని కరిణంగారి అమ్మాయి సుధ పెళ్ళి చేసుకోమని అడుగగా, తనకా అర్హత కలిగినప్పుడు తప్పకుండా చేసుకొంటానని సమాధానమిస్తాడు. భానుమూర్తి తల్లిదండ్రులు పోయిన తరువాత అతని బాధ్యతను, అక్క జానకికి ఇష్టంలేకపోయినా బావ రాజారాం స్వీకరిస్తాడు. ఓ హత్యకేసులో ఇరుక్కుని జైలుకెళ్లిన భానుమూర్తికి, అక్కడ చలపతితో పరిచయము అవుతుంది. అతను ఏ కారణాన జైల్లోపడ్డాడో భానుమూర్తికి చెప్తాడు. రాజారాం గుండెపోటుతో మరణిస్తాడు. జైలునుండి విడుదలైన భానుమూర్తి ఆయన అంత్యక్రియలు తానే చేస్తాడు. కొడుకు రామం కోరికమీద జానకి, ఆమె మిగతా పిల్లలతో పూనా వెళ్ళిపోతుంది. భానుమూర్తికి భాస్కర్రావ్‌తో పరిచయమేర్పడుతుంది. అతని సహాయంతో సినిమాల్లో చిన్న చిన్న వేషాలు వేస్తూ, చలపతి తల్లిని, చెల్లిని సంరక్షిస్తూంటాడు భానుమూర్తి. చలపతి తల్లి చనిపోయిన తరువాత, అతని చెల్లెలు రాణీని తీసుకొని మద్రాసు చేరుకొంటాడు భానుమూర్తి. అక్కడి డాక్టరు అతనికి 'లెప్రసీ' వ్యాధి సోకిందని చెప్పగా విని భయకంపితుడౌతాడు

మనసుమీద తరచుగా ప్రసరిస్తూనే వుంది.

"మట్టితో చేసేసి ఆడుకుంటావు
మట్టిలో కలిపేసి ఊరుకుంటావు
మధ్యలో ఇస్తావు మాకెన్నో బంధాలు
పెంచుకొనువేళలో తుంచిపారేస్తావు"—
ఎంత చక్కటి భావం ?? ...

ఆ తత్వాన్ని పాడుతూనే — దానికి లయగా వయొలిన్ వాయించసాగాడు భానుమూర్తి.

అలా ఎంత సమయం గడిచిపోయిందో అతనికే తెలియలేదు. ఇంతలో తలుపు తట్టిన చప్పుడు కావటంతో వాస్తవానికి వచ్చాడు.

వెళ్ళి, తలుపుతీశాడు.

"అమ్మాయ్ ఇంకారాలేదా ?" తడిసిన గొడుగును ముడిచి గుమ్మం దగ్గర పెట్టి— లోపలకు వచ్చి కూర్చుంటూ అడిగారు సంగీతం మాస్టారు.

"ఇంకాలేదండీ ! వర్షం పడుతోంది కదా ... ఎక్కడయినా ఆగివుండాలి !"

గడియారం అయిదుగంటలు కొట్టింది.

"ఉండండి ! కాస్త వేడిగా టీ తయారుచేసి తెస్తాను" అంటూ లోపలకు వెళ్ళాడు. స్టౌ వెలిగించి టీ కలిపి, రెండు కప్పుల్లో పోసి స్టౌ ఆర్పేసి — మళ్ళీ ముందు గదిలోకి వచ్చాడు.

"నాక్కూడా వయొలిన్ నేర్చుకోవాలని వుంది మాస్టారూ !" అన్నాడు టీ కప్పు ఆయనకు అందిస్తూ.

"మంచిదే ! మీకు సంగీతంలో ఏదైనా ప్రవేశం వుందా ?" అడిగారాయన.

"సంగీతమంటే అభిరుచివుంది. అంతకు మించి నేర్చుకోవాలని కోరిక ఎక్కువగా వుంది."

"శుభం ... మంచి రోజు చూసి ప్రారంభించండి !"

"నేర్చుకోవటానికి ఎంతకాలం పడుతుందంటారూ ?"

"కచేరీలు చేసే స్థితికి రావాలంటే కనీసం రెండు మూడేళ్ళయినా నేర్చుకోవాలి. అయినా కృషి చేస్తే సాధించలేనిదే ముంటుంది ?"

సంగీతం గురించీ — రకరకాల రాగాలు గురించీ మేస్టారు చాలా విషయాలు ప్రస్తావించారు.

అప్పటికి చీకటి పడింది.

అయినా రాణీ ఇంకా ఇంటికి రాలేదు.

"బహుశా ప్రయివేటు క్లాసు ఏదైనా వుండి వుండాలి. లేకపోతే స్నేహితులతో ఏదైనా పిక్చర్‌కి వెళ్ళి వుంటుంది. ఇప్పటికే బాగా పొద్దుపోయింది. మరి నేను వెడతాను" అంటూ లేచారు మేస్టారు.

"మంచి రోజెప్పుడో చూడండి ! మీరు ప్రారంభిద్దురుగాని !" మళ్ళీ మరోసారి భానుమూర్తికి చెప్పి వెళ్ళిపోయారాయన.

రాత్రి పది గంటలయినా రాణీ ఇంటికి రాలేదు. ఏమై వుంటుందో అర్థంకాక, ఆందోళన చెందాడు భానుమూర్తి. కాలేజీకి ఫోనుచేస్తే ప్రయివేటు క్లాసులేవీ జరగ లేదనీ—అందరూ వెళ్ళిపోయారనీ తెలిసింది.

తెల్లవార్లూ ఆమె రాకకోసం ఎదురు చూస్తూ మేలకువగానే వున్నాడు. త్యాగరాయనగర్‌లో రాణీ స్నేహితురాలు ఒకామె వుంది. అప్పుడప్పుడు రాణీ వాళ్ళింటికి వెడుతూంటుంది. ఆమెతోకలసి సినిమాలు కూడా చూస్తుంటుంది.

ఇంకా పూర్తిగా తెల్లవారకుండానే — వాళ్ళింటికి వెళ్ళాడు భానుమూర్తి. అంత క్రితం రోజున రాణీ కాలేజీకి కూడా రాలేదని చెప్పింది ఆ అమ్మాయి.

రాత్రి తెల్లవార్లూ మిణుకు మిణుకు మన్న ఆశకాస్తా హరించుకపోయింది. ఇంటికి తిరిగొచ్చేసరికి అతనిలో ఎక్కడ



లేని నీరసమూ, నిస్పృహా నిండిపోయాయి. కాఫీ కూడా తాగకుండా — కుర్చీలో కూలబడిపోయాడు. పిచ్చివానిలా శూన్యంలోకి చూస్తూ వుండిపోయాడు.

ఎంత ఆలోచించినా రాణీ ఎక్కడకు వెళ్ళిందో ఊహించలేక పోతున్నాడు.

అయినా ఈమధ్య రాణీ వింతగా ప్రవర్తించటం తాను గమనిస్తూనే వున్నాడు. తనపట్ల ఇదివరకటి ఆదరణ ఆమెలో ఇప్పుడు కనిపించటం లేదు. తన నుంచి దూరదూరంగా తప్పించుకుంటూ తిరుగుతోంది.

తన వస్తువుల్నిగానీ, బట్టల్నిగానీ — సాధ్యమైనంత వరకూ దూరంగా వుంచుతోంది. తాను కాఫీ తాగినా, మంచినీళ్ళు తాగినా — ఆ గ్లాసుల్ని విడివిడిగా వేరు ప్రత్యేకంగా తోమిస్తోంది.

తనలోవున్న ఆ భయంకరమైన వ్యాధి ఆమెకు కూడా వ్యాపిస్తుందని ఆమె భయం కావచ్చు.

తన ఇంట్లో — తన ఆత్మబంధువుగా భావించుకుంటున్న రాణీ ముందు, తనకు ఆ పరిస్థితి కలిగినందుకు, భానుమూర్తి బాధపడుతూనే వున్నాడు.

ఒకసారెప్పుడో రాణీ అంది కూడా —

"లెప్రసీ అంటువ్యాధట కదూ?" అని.

భానుమూర్తి బదులు చెప్పేలోగానే —

"మోహన్ చెప్పాడు. నన్ను జాగ్రత్తగా వుండమని హెచ్చరించాడు" అంది రాణి మళ్ళీ.

చటుక్కున మోహనరావ్ గుర్తొచ్చాడు భానుమూర్తికి.

'ఒకవేళ రాణీ మోహనరావుతో ఎక్కడికైనా వెళ్ళిందేమో ?'

## అనుభూతీ — అనుబంధం

ఆ ఆలోచన వచ్చేసరికి — అతని మనసు మారుమూలల్లో ఎక్కడో ఆశాకిరణం పొడసూపింది. మోహన్రావుతో వెళ్ళినా ఫరవాలేదనుకున్నాడు.

మోహన్రావుని తాను ఒకసారి చూశాడు. తన కోరికమీద రాణీ అతన్ని ఓసారి తమ ఇంటికి భోజనానికి ఆహ్వానించింది. అప్పుడే అతన్ని పరిశీలనగా చూశాడు. సినిమా హీరోలా పొడుగ్గా, అందంగా కనిపించాడు.

"నువ్వూ, రాణీ ప్రేమించుకున్నారట కదూ?" మోహనరావుని అడిగాడు అప్పుడు.

"అవునండీ! ఈ బి.ఏ. పూర్తయిన తర్వాత ఏదైనా ఉద్యోగం చూసుకుని రాణీని పెళ్ళి చేసుకుంటాను" అన్నాడు మోహన్. అతని మాటలు దృఢంగానూ, గంభీరంగానూ వినిపించాయి.

మోహనరావుని పెళ్ళి చేసుకుంటే రాణీ సుఖపడుతుందనే నమ్మకం తనలోనూ కుదిరింది. ఒకవేళ ఇప్పుడు రాణీ అతనితోనే ఎక్కడికైనా వెళ్ళిపోయిందా ? అయినా అంత హఠాత్తుగా తనతోకూడా చెప్పకుండా ఎందుకు వెడుతుంది ?

పది గంటలవుతోందనగా — కాలేజీకి వెళ్ళాడు భానుమూర్తి. బి.ఏ. ఫైనలియర్ క్లాసులో — మోహనరావు గురించి వాకబు చేశాడు. ఆరోజూ, అంతకుముందు రోజూ — అతనుకూడా కాలేజీకి రాలేదని తెలుసుకున్నాడు.

తాను అనుకున్నట్లే జరిగింది ... !

ఇద్దరూ కలిసే — ఎక్కడికో వెళ్ళిపోయారు !

ఎక్కడికి వెళ్ళివుంటారు ? మరో నాలుగైదు నెలలు ఆగివుంటే — తానే స్వయంగా వాళ్ళ వివాహం జరిపించాలనుకున్నాడు. ఈలోగా వాళ్ళ తొందర పడలేదు కదా ?

రాణీ తిరిగి వస్తుందని, ఆ తర్వాత వరసగా నాలుగు రోజులు ఎదురుచూశాడు. ఐదోరోజున రాణీ నుంచి వుత్తరం వచ్చింది.

ఆ ఉత్తరాన్ని చూసి రాణీ వచ్చినట్టే సంబరపడ్డాడు భానుమూర్తి. చదివిన వుత్తరాన్నే పదిసార్లు చదువుకున్నాడు.

"... నీకు చెప్పకుండా, ఇలా వచ్చేసినందుకు ముందుగా క్షమించమని కోరుకుంటున్నాను. మోహన్ నన్ను ఎంతగానో ప్రేమించాడు. బి.ఏ. పరీక్ష పాసయి ఏదైనా ఉద్యోగంలో చేరిన తరువాత — వాళ్ళ ఇంట్లో వాళ్ళను ఒప్పించి — నన్ను చేసుకోవాలనుకున్నాడు. కానీ అంతవరకూ నేను నీ దగ్గరే వుంటే — నీ వ్యాధి నాకూ అంటుకోవటానికి అవకాశం వుంటుందని మోహన్ భయపడ్డాడు. అందుకే నీకు దూరంగా వుండమని నన్ను పదేపదే హెచ్చరించేవాడు. అదీ కాకుండా, అతనికి వేరే ఏదో సంబంధం చూసి వాళ్ళవాళ్ళు ఖాయపరిచారట ! ఈ పరిస్థితుల్లో మాకు ఇదొక్కటే మార్గంగా కనిపించింది. ప్రస్తుతం మోహన్ ఉద్యోగం కోసం ప్రయత్నం చేస్తున్నాడు ... ఉద్యోగం దొరికిన తరువాత మళ్ళీ రాస్తాను.

అన్నట్లు మరో సంగతి. నీ సూట్‌కేసులో వున్న మూడు వేలూ నేను తీసుకున్నాను ఏమీ అనుకోవద్దు. నేం తొందర పడినందుకు — క్షమించమని మరోసారి కోరుకుంటున్నాను.

... నీ
రాణీ ..."






ఆ వుత్తరం బొంబాయినుంచి వచ్చింది. పైన తారీఖు కూడా వేసి 'బొంబాయి' అని రాసివుంది. కానీ అడ్రసు రాయలేదు. మరి తాను మాత్రం జవాబు ఎక్కడికి రాస్తాడు.

వాళ్లు తొందర పడ్డారని భానుమూర్తి అనుకున్నాడు.

రాణీ మాట ఎలా వున్నా మరో నాలుగయిదు నెలలు ఆగితే, మోహన్ చదువు పూర్తయి వుండేది. కాలేజీలో కష్టపడి చదివి — పరీక్ష రాయకుండా వెళ్లిపోయాడు. కనీసం చేతిలో డిగ్రీకూడా లేకపోతే, అతనికి ఉద్యోగం ఎక్కడ దొరుకుతుంది? అతన్ని నమ్ముకున్న రాణీ ఏం సుఖ పడగలుగుతుంది?

అయినా రాణీ తన దగ్గరవుంటే — తన వ్యాధి ఆమెకూ అంటుకుంటుందని మోహనరావు భయపడటంలోనూ తప్పు లేదు. అది అతని స్వార్థమే కావచ్చు — ఆ స్వార్థంలోనూ రాణి శ్రేయస్సు దాగివుంది.

అసలు తాను మాత్రం రాణీ శ్రేయస్సు కోరటంలేదా? రాణీ వచ్చి అడిగివుంటే — తనంతట తానే ఆమెకు దూరంగా మరో చోటకు వెళ్లిపోయుండేవాడు. మొదటి నుంచీ ఎదుటి వ్యక్తి శ్రేయస్సును వాంఛించే బలహీనతనే తాను పెంపొందించుకున్నాడు.

ఏది ఏమైనా —

తన జీవితంలో మరో అధ్యాయం ముగిసిపోయింది. ఎంతోమంది తన జీవితం పొడుగునా తారసపడుతూ వచ్చారు తనకు' అందరూ అంతలోనే ఎవరి దారిన వాళ్లు వెళ్ళిపోయారు. వాళ్ళతో ఏర్పడిన అనుబంధాల తాలూకు అనుబంధాలే, ఆనవాళ్ళుగా మిగిలిపోతున్నాయి. వాళ్ళ జ్ఞాపకాలు మాటిమాటికీ తనను కలవరపెడుతున్నాయి.

చివరకు రాణీ కూడా తనను వదలుపెట్టి దూరంగా వెళ్ళిపోయింది.

## 15

భానుమూర్తి సినీమా జీవితానికి స్వస్తి చెప్పి చాలా కాలమయింది. నిరాడంబరంగానూ, నిర్వికారంగానూ కాలాన్ని గడుపుతున్నాడు. ఉదయం ఎక్కువగా పుస్తకాలు చదవటం, సాయంత్రం పూట సంగీతాన్ని సాధనచేయటం — అవే అతని దినచర్యలోని ముఖ్యమైన అంశాలుగా మారిపోయాయి.



పశ్చిమ జర్మనీలో ఒక చుట్టంపెట్టె సైజులో ఆరు షార్ట్‌వేవ్ బ్యాండ్లు, ఒక లాంగ్‌వేవ్ బ్యాండ్లు, ఏ. యం. ఎఫ్. ఎమ్. బ్యాండ్లు, టెలిస్కోపిక్ ఎంటెన్న వున్న ట్రాన్సిస్టర్ రేడియో ఈమధ్యనే చేసి విడుదల చేశారు.

అతనిలో ప్రవేశించిన వ్యాధి లక్షణాలు చూసేవారికందరికీ ఇప్పుడు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఏవో మందులు వాడుతూనే వున్నాడు. అయినా ముఖంలో ఇదివరకటి ఆకర్షణ కనిపించటంలేదు చేతివేళ్ళూ, కాలివేళ్ళూ, చెవుల అంచులూ నల్లగా మొద్దుగా మారిపోయాయి.

వీధిలో తనను ఎవరైనా చూస్తే అసహ్యించుకుంటారనే భావం అతనిలో ఎక్కువయింది. అందుకే పగలంతా ఇంట్లోనే వుండిపోతున్నాడు. ఏమైనా సరుకులు ఇంట్లోకి అవసరమైతే సాయంత్రం చీకటి పడేవేళకు బజారు వెళ్లి తెచ్చుకుంటున్నాడు.

ఆరోజు మధ్యాహ్నం మూడు గంటలవుతూందనగా — భానుమూర్తి కోసం వచ్చాడు భాస్కర్రావు.

చాలాకాలం తరువాత వచ్చిన స్నేహితుడిని చూడగానే భానుమూర్తికి ఎంతో సంతోషం కలిగింది. ఆ వెంటనే — అతని కళ్ళల్లో అశ్రువులు నిలిచాయి.

"ఆమధ్య రెండు మూడుసార్లు ఈ వూరొచ్చాను. కానీ మిమ్మల్ని కలవటం పడలేదు. మొన్న మీరు రాసిన లెటర్ చూసి షాక్‌తిన్నాను. అసలు మీకెలా వచ్చింది ఈ వ్యాధి?" కూర్చున్న తరువాత అడిగాడు భాస్కర్రావ్.

'ఖర్మ!'' విరక్తిగా నవ్వేడు భానుమూర్తి.

అతను చెప్పబోయేదేమిటో వినాలని — మరేమీ మాట్లాడకుండా కూర్చున్నాడు భాస్కర్రావు.

"ఏ వయసుకి ఆ ముచ్చట జరగాలంటారు. కానీ నా విషయంలో అలా జరగలేదు. ముద్దు ముచ్చటలు జరపవలసిన కన్నవాళ్లు నా చిన్ననాడే — నా దారి నన్ను చూసుకొమ్మని — వాళ్ళదారిన వాళ్లు వెళ్లిపోయారు. పెంచి పెద్దచేసిన బావగారు ప్రేమను పంచారే తప్ప — ఓ మంచిదారిని — నా కంటూ చూపించలేకపోయారు. కోరికలంటే ఏమిటో తెలిసే వయసొచ్చేసరికి — రజాక్‌తో పరిచయం ఏర్పడింది. కోరికలు తీర్చుకునే మార్గాలెన్నింటినో అతని నుంచి తెలుసుకున్నాను ..."

"రజాక్ హైదరాబాద్‌లో వుంటున్నాడా?" అడిగాడు భాస్కర్రావ్.

"ఒకప్పుడు వుండేవాడు. ఇప్పుడు జైల్లో వుంటున్నాడు. పదేళ్ళ క్రితం ఓ హత్య చేశాడు. అతనికి యావజ్జీవ శిక్ష పడింది. అతనితో కలసి నేను ఎన్నోసార్లు తాగాను ... ఎంతోమందిని అనుభవించాను. రజాక్ అంటూ వుండేవాడు — 'ఎన్నో సుఖాలను మనం అనుభవించేటప్పుడు, కొన్ని కష్టాల్ని కూడా భరించక తప్పదు' అని... అది నిజమే! అప్పుడు పొందిన సుఖాలకు ఆనవాలుగా ఇప్పుడీ భయంకర వ్యాధి నన్ను పట్టుకుంది'' — నిట్టూర్చాడు.

/ఇంకా వుంది/

**వనితలకు మనవి**

కొత్త రకం వంటలు
క్లుప్తంగా వ్రాసి పంపితే
త్వరగా పరిశీలించ గలం —సం.

# ✦ డాక్టర్ సలహాలు ✦

డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

కె. ఎస్. ఆర్. — తుని

నా పెదవులపైన, చిగుళ్ళపైన నల్లని మచ్చలు వున్నవి. అవి మధ్యలో వచ్చినవి. ఇలా ఎందుకు వస్తాయి ? వాటికి ఏ మందులు వాడవలెను ?

★ పెదవులపైనగాని, చర్మపు పైభాగాన గాని మచ్చలనేవి ఏర్పడటం చర్మంలో ఉన్న 'మెలనిన్' అనే రంగు పదార్థాన్ని తయారుచేసే. ప్రకృతి సిద్ధమైన రసాయనిక మార్పులను శరీరంలో కలుగజేసే వాటి ప్రభావం వలననే.

ఈ మచ్చలు పుట్టుకతోనే వుండాలనే నియమం లేదు. ఏ వయస్సు వారికైనా సరే, వారికి ఏ భాగంలోనైనా సరే ఈ మచ్చలు ఏర్పడే అవకాశం వున్నది.

ఈ మచ్చలను పోగొట్టడానికి ప్రయత్నించటం అనవసరపు శ్రమ; ధన వ్యయం మాత్రమే అవుతాయి. పుట్టుమచ్చలు చర్మంలో వుంటే వాటి వల్ల హాని ఏ మాత్రం జరుగదో అదే మాదిరిగా వీటివల్ల కూడా ఏమీ హాని రాదు.

జి. ఎస్. — సుంకట్రేవు

నా వయస్సు 19 సం॥. నా కంటి రెప్పపైన రెండు బుడిపెల వలె వచ్చి కొన్ని నెలలయినది. డాక్టరు సలహాపై కొన్ని మందులు వాడాను. అయినా ఏమీ గుణం కన్పించలేదు. దీనికి నివారణ ఏమిటి ?

★ కంటి రెప్పలమీద 'బుడిపెల' వలె వచ్చి కొన్ని మాసాలుగా చికిత్సానంతరం గూడా వుండటం 'కలేజియన్' అనే రోగాన్ని సూచిస్తుంది.

కంటి రెప్పలలో వున్న 'మీబోమియన్' గ్రంథుల నాళములో మార్గావరోధం ఏర్పడటం వల్ల, ఈ గ్రంథుల నుంచి ఉత్పత్తి అయ్యేవి బహిర్గతమయ్యే మార్గంలేక పేరుకు పోవటమే ఈ 'బుడిపెల'కి కారణం.

చిన్న శస్త్రచికిత్స ద్వారా వీటిని నేత్రవైద్యులు సులభంగా తీసివేస్తారు. ఏ విధమైన ప్రమాదమూ ఈ ఆపరేషన్‌వల్ల ఇటు కంటికిగాని, అటు శరీరానికి గాని రావటానికి అవకాశం లేదు.

ఎ. ఆర్. ఆర్. — సికింద్రాబాద్

నా వయస్సు 40 సం॥లు. 4 సంవత్సరముల క్రితం నాకు టి. బి. వచ్చినది. 3 సం॥లు ట్రీట్‌మెంటు తీసుకున్నాను. మందులు తీసుకో నక్కరలేదంటే 1 సం॥ క్రితం మానివేశాను. అన్ని బాధలు తగ్గినవి. కాని ప్రతి ఉదయం లేవగానే 1 గంట వరకూ దగ్గు, ఆయాసం వుంటున్నది. తర్వాత రోజంతా ఏ బాధలూ లేవు. ఈ దగ్గు,ఆయాసం తగ్గటానికి తిరిగి ఆ మందులే వాడవలసి వుంటుందా? లేక మరేదైనా వాడాలా ?

★ క్షయ రోగానికి మామూలుగా ఒక సంవత్సరంపాటు క్రమంగా నిర్ణీత విధిలో మందులు వాడటం అత్యవసరము. కొందరికి రోగ లక్షణాలు మొ॥వి అంతగా తగ్గకపోతే అవి తగ్గేవరకూ అంటే రెండు సం॥ల వరకు ఈ మందులు వాడవలసి వుంటుంది. కాని 3 సం॥లు చికిత్స సాగించటం మీలో అశ్రద్ధనిగాని, వైద్య విధానంలో ఏదో పొరపాటునిగాని సూచిస్తుంది. ప్రస్తుత దగ్గు, ఆయాసం మీ ఊపిరి తిత్తులలో, క్షయ వల్ల ఏర్పడిన రోగ లక్షణాల చిహ్నాల ప్రభావమే.

దీనికి ప్రత్యేక వైద్యం అనవసరం. బాగా గాలి పీల్చి వదులుతూ ఛాతీమీద కండరాలు కదిలేలా రోజూ 1 గంటసేపు చేస్తూ వస్తే ఏ మందులూ లేకుండా 4 నెలలలో మీకు వున్న లక్షణాలు పూర్తిగా రూపుమాసిపోతాయి.

డి. జె. — మంగళగిరి

మా బాబుకి 7 సం॥లు. వాడికి రెసిడ్యువల్ పోలియో వలన ఎడమకాలు తొడ సన్నముగా నున్నది. 'టెండన్ ట్రాన్స్‌ఫర్' చేసి 'డిఫార్మిటీ'ని తొలగించారు. అన్ని కదలికలు బాగానే వున్నవి. కాని కాలు సన్నముగాను, ఇంకా కొద్దిగా చచ్చు గాను వున్నది. తొడ లావు అగుటకు వీలులేదా ?

★ కొందరికి పోలియో వచ్చిన తర్వాత కాలు మడమ వద్దవున్న కండరాలు సన్నబడిపోయి, ఆ కాలు రెండవ దానికన్నా చిన్నదిగా అవటం వైద్య రీత్యా 'టెండన్ ట్రాన్స్‌ఫర్‌మేషన్' చేయటం సహజం. అయితే ఆ ఆపరేషన్ చేసినంత మాత్రన ఇదివరకే జరిగిన మార్పులు వాటంతట అవే సర్దుకుపోవు. 'ఫిజియో తెరపీ' అంటే ప్రతి కీలు కదిలే విధంగా వ్యాయామం చాలా అవసరం. రోజులో ఎంత ఎక్కువ సేపు బాధింపబడిన భాగాలను కదిలిస్తూ వుంటే అంత మంచిది. లావు అవటం అనేది మీ వ్యాయామ శక్తి సామర్థ్యాలను బట్టి వుంటుంది.

జి. పి. ఆర్. — విజయనగరం

నా వయస్సు 25 సం॥లు. నాకు తరచుగా గంటకు 2 సార్లు మూత్ర విసర్జన జరుగుతోంది. ఇది మామూలుగా కాక బొట్లు, బొట్లుగా కష్టముమీద జరుగుతూంది. దీనికి కారణము నివారణోపాయము తెల్పండి ?

★ దీనినే 'స్ట్రెస్ ఇన్‌కాన్‌టినెన్స్' అంటారు. మూత్రాశయంలో, ఏ కొద్దిమాత్రం మూత్రం చేరినా, అక్కడి నరాలు ప్రేరేపింపబడి, వెంటనే మూత్రాశయపు గోడలలోని కండరాలు ముకుళించుకొని తద్వారా మూత్ర విసర్జన జరగటమే మీరు వ్రాసిన లక్షణానికి మూల కారణం.

బలవంతంగా కొద్దికొద్దిగా కాలక్రమేణా, మూత్ర విసర్జనను ఆపుకోవటం వల్ల ఈ లక్షణాన్ని పోగొట్ట వచ్చును. మందులవల్ల ఏ ఉపయోగమూ వుండదు.

## లక్ష మందికి స్టేడియం !

జూలై 19న ప్రారంభమై ఆగస్టు 3తో ముగిసే ఒలింపిక్స్ – 80 క్రీడోత్సవాల కోసం మాస్కోలో భారీఎత్తున అత్యాధునికంగా ఏర్పాట్లు జరిగాయి. కీవ్ సెంట్రల్ స్టేడియంతో సహా మొత్తం 12 స్టేడియంలని అత్యాధునికంగా పునర్ నిర్మించారు. సెంట్రల్ స్టేడియంని లక్ష మంది ప్రేక్షకులు ఎలాంటి అసౌకర్యం లేకుండా పోటీలను తిలకించడానికి అనువుగా నిర్మించారు. దీంట్లో మూడంతస్తులుగల ఆరోగ్య పునరావాస కేంద్రాన్ని, ఆధునిక వైద్య పరికరాలతో ఏర్పాటు చేస్తున్నారు.

పత్రికలవారి కోసం తొమ్మిదంతస్తులుగల 'ప్రెస్ సెంటర్'ని ఆధునికంగా రూపొందిస్తున్నారు. క్రీడాకారుల కోసం, దేశ విదేశాల నుంచి వచ్చే ప్రేక్షకుల అభిరుచులకి తగ్గట్లుగా హోటళ్ళని, షాపులని ఏర్పాటు చేస్తున్నారు. ఒలింపిక్స్ – 80 ఏర్పాట్లకు మొత్తం 170 లక్షల రూబుల్సు ఖర్చవుతుంది. పునర్నిర్మాణంలో ఉన్న కీవ్ సెంట్రల్ స్టేడియంని ఈ చిత్రంలో చూడవచ్చు.



# దివ్యమైన
# తెలుపు
# డెట్ యొక్క
# తెలుపు

క్రొత్త ఫార్ములా

## డెట్

డిటర్జెంట్ ఉతికే పౌడర్




సాటిలేని వుతుకు శక్తి, అదనపు నురుగు,
తాజా సువాసన మరియు దివ్యమైన తెలుపు!



'మాయదారి కృష్ణుడు'లో సుజాత, శ్రీధర్

# సినిమా విశేషాలు

—జి.వి.జి.

## జూలై మూగకు మాటొస్తే విడుదల

వి. మధుసూదనరావు దర్శకత్వం వహించిన శ్రీ శివకామేశ్వరీ పిక్చర్స్ "మూగకు మాటొస్తే" చిత్రం జూలై మొదటి వారంలో విడుదలవుతున్నట్లు చెప్పారు నిర్మాత విజయకుమార్. జయసుధ మూగమ్మాయిగా నటించింది. కవిత, రూప, రమాప్రభ, ఎస్. వరలక్ష్మి, మురళీమోహన్, శ్రీధర్, ప్రసాద్ బాబు, మాడా ప్రభృత తారాగణం. బాబీ కథకు బొల్లిముంత సంభాషణల కర్త. చక్రవర్తి సంగీత దర్శకుడు. కె.ఎస్. ప్రసాద్ ఛాయాగ్రాహకుడు. ఆర్. శ్రీనివాసరావు సహకార దర్శకుడు.

## సెన్సార్ సర్టిఫికేట్లు

ఏప్రిల్ నెలలో సెన్సార్ వారికి ప్రదర్శింపబడిన 9 మలయాళ చిత్రాలలో 8 చిత్రాలకు 'ఎ' సర్టిఫికేట్లు ఇవ్వబడ్డాయి.

దాసరి నారాయణరావు దర్శకత్వం నెఱపిన "జ్యోతి బనే జ్వాల" చిత్రానికి తొలుత 'ఎ' సర్టిఫికేట్ ఇవ్వబడింది. అంతకుముందు ఆ చిత్రం మాతృక "కటకటాల రుద్రయ్య"కు 'యు' సర్టిఫికేట్ ఇవ్వబడింది. ఈ విషయాన్నే రివైజింగ్ కమిటీకి నివేదిస్తే, చివరికి హిందీ చిత్రానికీ 'యు' సర్టిఫికేట్‌ను ఇచ్చారు. ఆ సంగతి తెలిసిన వెంటనే హీరో జితేంద్ర ఆనందోద్రేకంతో వెంటనే మిఠాయి తెప్పించి, నటరాజ్ స్టూడియోలో ఉన్న వారికి పంచిపెట్టాడట. ఆ మిఠాయికి అయిన బిల్లు రెండువందల రూపాయలట.

## గోలనాగమ్మలో కవాలీ, ఫకీరుల గోల

ఫకీరు (సత్యనారాయణ), కపాలీ (సారథి) చాలా కాలం తర్వాత కలుసుకున్నారు.

"కపాలీ, నువ్వా! ఎచటికి వెళ్లితివిరా! ఇన్నాళ్ళూ ఎక్కడుంటివిరా?"

"రోలు వచ్చి మద్దెలతో మొరపెట్టుకున్నదట. అలా ఉన్నాది, గురూ! నీవు డైరెక్టర్ పెళ్ళాన్ని కుక్కను చేసేశావా? అది నీ మంత్రదండం ఎత్తుకుపోవాదా? దానివెంట నేను పారిపోయానా? అది పోయి పోయి ఒక గల్లీలో నాకు షూప్ ఇచ్చేసినాది. నేను ఒక రాంగ్ నెంబర్ ఎత్తుకొని, ఒక బంగళాలో ఎంటర్ అయిపోనాను. అక్కడ గూర్ఖావాడు ఎత్తుకొని, 'కుక్కలదొంగ' అని పోలీసులకి హేండోవర్ చేసినాడు. ఆళ్ళు బొక్కలో తోసినారు."

"కపాలీ! మంత్రదండం లేనిదే బ్రతుకు నరకంగా మన్నదిరా!"

"నిజమే, గురూ! బ్రతికి చెడ్డవాడివి.—నిన్ను సూత్తాంటే డిస్‌మిస్ అయిన మినిస్టర్‌లాగున్నావ్. ఆళ్ళ పని అంతే. పదవి పోయిందంటే, పిలిచి మంచినీళ్ళు కూడా ఇవ్వరు."

"అబ్బా! నేనీ బ్రతుకు బ్రతకలేనురా!"

"అట్టా జారిపోకూడదు, గురూ! ధైర్యే సాహసే లక్ష్మీః—అన్నారు. డిస్‌మిస్ అయిన మినిస్టర్‌కి మళ్ళీ ఛాన్సు వస్తే, వీడ్ని డిస్మిస్ చేసినవాడు డిస్‌మిస్ అయి, మళ్ళీ వీడు కుర్చీమీద కూర్చుంటాడు. అంతా అదృష్టం. నసీబు."

"ఆ తర్వాత వీళ్ళిద్దరూ భావికార్యక్రమాలకు పునాదులు వేసుకుంటారు," అని వివరించారు డైరెక్టర్ పి. వి. రాజు. కె. కె. శర్మ నిర్వహణలో తలాటం వెంకటేశ్వరరావు, కొండేపూడి సుబ్బారావు నిర్మించే రైన్‌బో సినీ ఆర్ట్స్ "గోలనాగమ్మ" చిత్రానికి డి. వి. నరసరాజు సంభాషణలకర్త. దేవరాజ్ ఛాయాగ్రాహకుడు. చక్రవర్తి సంగీత దర్శకుడు. సమర్పణ: కె. వి. కె. రెడ్డి.

## ఆమె అతనుగా మారాక సినిమా హీరో!

విశ్వ విఖ్యాత హాకీ ఛాంపియన్ కుమారి బల్జీత్ కౌర్ లింగ పరివర్తనం చెంది, శస్త్రచికిత్స మూలంగా పురుషుడుగా మారడం జరిగింది. ఇప్పుడా వ్యక్తి పేరు బల్జీత్ సింగ్. సినిమా హీరో అవడానికి ప్రయత్నిస్తున్నాడు!



'మదన మంజరి'లో జయమాలిని

# తెల్లదనానికి మొదటిది
# ప్రకాశానికి మొదటిది

TATA'S
501
BLUE DETERGENT BAR

## నీలం 501
### డిటర్జెంట్ బార్

"హెచ్చు
ఉతికే శక్తి!
హెచ్చు పొదుపు"



"ముద్ద కాదు, ఎక్కువ
రోజులు వస్తుంది.
పుష్కలమైన నురుగు!"

## మరొక 501 విజేత

CAST-5-253 TL

టాటావారి తయారీ

క్రీస్తుశకం రెండువేల పధ్నాలుగో సంవత్సరం; వర్షాకాలంలో ఒకనాటి ఉదయం, నల్లని మబ్బులు దుబ్బులుగా ఆకాశాన్ని కమ్మేసి చల్లని గాలి వీస్తుంటే హాయిగా ఉంది; నేను శిశువుగా అమ్మ ఒడిలో పడుకుని ఆనందంతో కేరింతలు కొడుతున్నట్టు. ఆ మబ్బుల్ని చీల్చుకుంటూ అప్పుడప్పుడు మెఱుపులు, ఉరుములు వస్తుంటే నేను హోం వర్క్ చేయనప్పుడు కోప్పడి నాన్న గర్జించినట్లుంది. స్కూలు ఎగకొట్టడానికి, ఎంతో హాయిగ వర్షంలో తిరగడానికి నా మనస్సు ఉవ్విళ్లూరుతోంది. కాని ...

నాన్న ఒప్పుకోడు. నాన్న మంచివాడే. ఆఖరికి అమ్మకూడా ఎవర్లూ చూడటం లేదనుకున్నప్పుడు నాన్నని ముద్దు పెట్టుకుని "ఎంత మంచి వాడివిరా" అంటూ ఉంటుంది. కాని ఎందుకా మంచితనం? స్కూలు మానేసి వర్షంలో పరుగు లెత్తే స్వేచ్ఛ నాకు నాన్న ఏనాడూ ఇవ్వలేదు; ఈనాడూ అంతే.

ఏది ఏమైనా గడియారాలు నడవక మానవు; నేనూ స్కూలుకి నడవక తప్పదు. మా ఇంటికి అడక్కోడానికి తరచుగా వచ్చే రాము నా ఈడు వాడే. కాని వాడికి ఎంత స్వేచ్ఛ! నేనూ వాడూ చాలాసార్లు ఇది చర్చించాం. రాము ఎప్పుడేం చేసినా తల్లీతండ్రీ అడ్డుపెట్టరు. (తిండీ పెట్టరనుకో) పొద్దున్నే నిద్రలేవక్కర్లేదు వాడు. ఎక్కడ కావాలంటే అక్కడ నిద్రపోవచ్చు; ఊళ్లో! స్కూలు బాధ లేనేలేదు. హాయిగా స్వేచ్ఛగా తన మనసు ఎలా చెప్తే అలా ఆడు కుంటాడు. రైళ్లలో టికెట్ కొనుక్కునే అవసరం లేకపోవటాన ఎన్ని ఊళ్లో చూశాడుట రాము. అవన్నీ శ్రద్ధగా విని తెల్సుకునే కొద్దీ ఆ ముష్టి కుర్రాడిదే బ్రతుకంటే, నాలా స్వేచ్ఛలేని బ్రతుకుకాదు అని ఓర్వలేనంత ఈర్ష్య కలిగింది నాకు.

మళ్లీ వాడొస్తే కాసేపు మాట్లాడి ఊరట చెందచ్చనే ఆశతో వీధి గది కటకటాల దగ్గర నిలుచున్నాను. కొద్ది నిమిషాల ల్యాక ఒక నైలాన్ చీర కట్టుకున్న ముసలావిడ మా ఇంటిముందు రిక్షా దిగింది. ఒక ప్లాస్టిక్ బ్యాగ్ పట్టుకుని మా ఇంట్లోకి రాబోయి, ఎందుకో గిరుక్కున తిరిగి రోడ్డు దాటి వెళ్లిపోయింది. అక్కడున్న సిమ్మెంటు బెంచీమీద కూర్చుని మా ఇంటివైపే చూడసాగింది. అలా పది నిమిషాలు గడిచాక పెద్ద పెద్ద వానచినుకులు పడసాగాయి. ఆవిడ వెంటనే తన పువ్వుల గొడుగు భళ్లున తెరిచి "నీ లెక్కెంత?" అన్నంత విసురుగా ఆకాశంవైపు ఎత్తింది. తలవంచుకునే మా ఇంటివైపు చూస్తోందావిడ.

నాకు స్వేచ్ఛాజీవి రాము వస్తాడనే ఆశ నశించడమూ, ఆ ముసిలావిడ పోలీస్ డిటెక్టివ్ ఏమో అనే అనుమానమూ ఒకేసారి కలిగాయి. మా నాన్న ఎప్పుడో మేము పుట్టకముందు ఏదో ప్రభుత్వ చట్టాన్ని ధిక్కరించాడుట. సాక్ష్యం లేక శిక్ష పడలేదుట; కాని రహస్య పోలీసులు ఆనాటి నుంచీ నాన్నమీద ఓ కన్నువేసి ఉంచారనీ, అప్పుడప్పుడు ఆయన గురించి ఆరా తీస్తుంటారనీ అమ్మ ఎవరితోనో నవ్వుతూ చెప్తుంటే విన్నాన్నేను. అంచేత ఆ బెంచీమీది ముసలావిడని కనిపెడుతూ నిల్చున్నాను. ఆవిడా ఎటో చూస్తున్నట్లు నటిస్తూ నన్నే చూస్తోంది.

వర్షం హోరెత్తి కురవసాగింది. కటకటా ల్లోంచి చేతులు చాపాను. విచ్చని పువ్వుల్లాంటి మెత్తని చినుకులు నా అరచేతులమీద డాన్సు చేస్తుంటే ఎంత హాయిగా ఉంది! కాని మరో నిమిషంలో అమ్మ అన్నం వడ్డించానంటూ వంటింట్లోంచి కేకవేసి నా కల చెదరగొట్టింది. ఇదే ఆ ముష్టి కుర్రాడైతేనా ఎవరూ ఇలా నిర్దాక్షిణ్యంగా డిస్టర్బ్ చేయరు. ఆ మాటకొస్తే రోడ్డుమీద పడి బురదలో దొర్లినా ఎవ్వరూ కాదనరు. నా బ్రతుకే ఇలా అయింది. చలం నాలాంటివాళ్ల బాధల్నేకదా అంత పదునుగా చిత్రించాడు!

కంచం ముందు కూర్చున్నాక అదంతా మరిచి పోయాను. అమ్మ అన్నంలో ఏం అమృతం కలుపు తుందో కాని తింటుంటే నాకు ఒళ్లు తెలీదు. అందుకే వీధిలోంచి ఆ ముసలావిడ పిలవడం అమ్మ వెళ్లి తలుపు తీయడం నేను గమనించనేలేదు.

ఆవిడ ఇంకేం మాట్లాడిందో కాని చివరకి నాకీ మాటలు వినిపించాయి. "—నేను రిక్షా దిగి ఇంట్లోకి రాబోతుంటే వీధి గదిలో ఎవరో మొగాళ్లున్నారే. చూస్తూ చూస్తూ ఎలా రాను అలాంటప్పుడు? సిగ్గేసి పోయిందనుకో. వర్షంలో తడుస్తూ ఆ బెంచిమీదే కూర్చున్నాను."

"ఇంట్లో మొగాళ్లెవరూ లేరే! ఆయనా, పెద్ద పిల్లలూ ఏడున్నరకే వెళ్లిపోయారు—" అమ్మ అంటోంది.

"ఏమో ఎవరో. నేను కళ్లారా చూశాను. చారల నిక్కరు వేసుకుని కటకటాలు పట్టుకుని నిలుచున్నాడు. పైన చొక్కా కూడా లేదు. సిగ్గుతో చచ్చిపోయాననుకో. ఎవరైనా పరాయి మొగాడు! అది చాలదూ. వీధి గుమ్మంలో నిలుచుని అతగాడుండగా ఎలా వస్తాను."

"ఏడిసినట్లుంది నీ సిగ్గు. మా బాలిగాడే అక్కడ నిల్చున్నది! ఫదేళ్ల కుర్రకుంక! వాడా పరాయి మొగాడు? నీ ఫ్రాయిడ్ భక్తి బంగారం గానూ! అనవసరంగా వానలో నానావు. ఇలా వచ్చి బట్టలు మార్చుకో," అంది అమ్మ నవ్వుతూ.

నేను 'పరాయి మొగాడు' అనే బిరుదు పొందడం తప్పో రైటో తెలిసే జ్ఞానం లేని వయస్సు నాది. కాని ఆవిడ వైఖరి నాకెందుకో ఎబ్బెట్టుగా తోచి జుగుప్స కలిగింది.

అమ్మ తిరిగి వచ్చి పెరుగు వడ్డిస్తుంటే "అమ్మా! ఇప్పుడొచ్చినావిడని బామ్మగారూ అనాలా, అమ్మమ్మగారూ అనాలా?" అని అడిగాను. అమ్మ పొంగి వచ్చే నవ్వాపుకుంటూ, "ఆ రెండు పేర్లలో ఏది వాడినా నా భరతం పడుతుందిరా అది. మంగమ్మ ఎవరనుకుంటున్నావు? కాలేజీలో నా క్లాస్‌మేట్! అంచేత 'ఆంటీ' అని పిలు" అని ఎందుకో మౌనంగా ఉండిపోయింది.

"అమ్మా, నీ కెన్నేళ్లే?" "నలభై" "మరి అంత పెద్దావిడ నీ క్లాస్‌మేట్ ఎలా అయింది?"



"పెద్దావిడ కాదురా. నాకంటే మూడేళ్లు చిన్నది అది. మా క్లాస్ అమ్మాయిలందరం దాన్నెంతో గారం చేసేవాళ్లం, అంచేత ఖర్మ కాలి ఇలా అయిపోయిందది. ఇంతకీ దాని రాత అలా ఉంది." అని కళ్లనీళ్లు తుడుచుకుంది అమ్మ.

"అమ్మా! ఏడుస్తావేమే."